# శ్రీచక్రసంచారిణీ శతకము

(దండక సహితం)

రచన

**డా॥ శివలెంక ప్రకాశరావు**

ఎం.ఏ., పిహెచ్.డి.,

ప్రిన్సిపాల్

శ్రీదేవీ వేదవిద్యాలయము &

శ్రీదేవీ సంస్కృతమహా విద్యాలయము

శ్రీ శై ల ం

**శ్రీ సరస్వతీ పబ్లికేషన్స్**

కా కి నా డ.

# మున్నుడి

ప్రియమిత్రులు శ్రీ పెదప్రోలు మారుతాత్మజవరప్రసాద్‌గారు కృష్ణాజిల్లా చల్లపల్లిలో కామేశ్వరమ్మ శ్రీరామమూర్తి పుణ్యదంపతులకు క్షీరాబ్ధి ఏకాదశినాడు ప్రభవించిన ముక్తాఫలం. న్యాయవాదిగా, వైద్యశిఖామణిగా వీరు సుప్రసిద్ధులు. హెచ్.ఎ.ఎల్. సంస్థలో అడ్మినిస్ట్రేటివ్ మేనేజరుగా పదవీ విరమణ జేసి ప్రస్తుతం హైదరాబాద్‌లో విశ్రాంతి తీసుకుంటున్నారు. వీరి సతీమణి చి॥సౌ॥ కమలాదేవిగారు పింగళివారి ఆడపడుచు. వీరుకూడా అదే సంస్థలో డిప్యూటీ మేనేజరుగా పనిచేస్తున్నారు. ఈ దంపతులకు చి॥ సౌ॥ శైలజ, చి॥ సౌ॥ శర్వాణి అనే కుమార్తెలు, చి॥ నారాయణ (సాఫ్ట్‌వేర్ ఇంజనీరు, సింగపూరు) అనే కుమారుడు ఉన్నారు.

ప్రసాద్‌గారు మాస్టర్ ఇ.కె.గారి శిష్యులు. అందువల్ల తాను తరించి, ఇతరులను తరింపజేయాలనే సదుద్దేశంతో శివశక్తి పీఠాన్ని హైదరాబాద్‌లో స్థాపించి, ఆధ్యాత్మిక సేవాకార్యక్రమాలనెన్నో చేపడుతున్నారు. వీరు 'శివశక్త్యానంద' నామాంకితులు.

శ్రీ ప్రసాద్‌గారి 60వ జన్మదినోత్సవం సందర్భంగా ఈ నా శతకాన్ని వెలుగులోకి తేవాలని సంకల్పించారు. వారికి నా కృతజ్ఞతాభివందనాలు.

ఈ శతకాన్ని ఆమోదయోగ్యంగా తీర్చిదిద్దిన ఆత్మీయులు శ్రీ టి. భాస్కరరావు (స్ఫూర్తిశ్రీ) గారికీ, శ్రీ వింజమూరి శేషఫణిశర్మగారికీ నా నమస్సులు.

ఈ చిన్ని పొత్తమును చక్కగా ముద్రించిన చి॥ టి. మురళి. శ్రీపతి ప్రెస్, కాకినాడకు, నాకన్ని యెడల సహకరించిన నా శ్రీమతి చి॥ సౌ॥ సరస్వతీదేవికి నా శుభాశీస్సులు.

ఇట్లు

శ్రీశైలం
14-1-2002

భవదీయుడు
**శివలెంక ప్రకాశరావు**

## డా॥ పెదప్రోలు మారుతాత్మజ వరప్రసాద్
## శ్రీమతి కమలాదేవి దంపతులు



ఆయురారోగ్య సంపదలలరజేసి
ఆర్ష ధర్మార్థ సద్విద్యనందజేసి
సరస సద్గుణ శీలప్రసాద మొసగి
ఇలను శ్రీదేవి వీరి రక్షించుగాత!

- డా॥ శివలెంక ప్రకాశరావు

# శ్రీ చక్రసంచారిణీ శతకము

1. శ్రీమంతంబు భవాబ్ధి తారకము, రాశీభూతభక్తార్తి సం
క్షేమాకార విశేష భాసురము సంసేవాశ్రితానంద దీ
ప్త్యామోదాంకిత కల్ప వృక్షము సహాయార్థ్యార్తి విచ్ఛిన్న సం
ప్రేమంబౌగద నీదు పాదయుగమో శ్రీచక్రసంచారిణీ !

2. భావావేశము పొంగువారె కనులన్ బాష్పంబు లూరెన్ హృదిన్
నీవే రూపును గట్టినిల్చితివి విన్పించెన్ మహామంత్రముల్
బ్రోవంగా నను జేరవచ్చితివా ! నాపుణ్యంబు పండంగ నీ
సేవన్‌జేసి తరింపనిమ్ము జననీ ! శ్రీచక్ర సంచారిణీ !

3. సంధానించితి నాదుమానసము నీ సాన్నిధ్యమున్ గోరి నే
బంధాలన్ తెగద్రెంచి భావమున నీపాదంబులన్ నమ్మి రా
గాంధుండన్ దగు నిత్యసాధనమునన్ కాంక్షింతు సాన్నిధ్యమున్
చిందింపంగ కృపారసంబు సతమున్ శ్రీచక్రసంచారిణీ !

4. నేడేదో వినిపించె మంత్రము భవానీ ! నీదు రూపంబునన్
చూడంగానది స్వప్నమందె జరిగెన్ చోద్యంబు నీ లీలలే
వేడన్‌వచ్చిన నన్ను బ్రోవగనితే పీయూషమందించి నా
చీడన్‌బట్టిన హృత్సరోరుహమునన్ శ్రీచక్రసంచారిణీ !

5. ధన్యంబాయెను నాదుజన్మ కలలో దర్శించినన్ గాని నా
పుణ్యంబే సఫలంబునయ్యె జనితామోదంబునన్ దేహమే
గణ్యంబౌ పులకాంకితంబయి కనెన్ గమ్యంబు చిద్రూపదా
క్షిణ్యంబే ప్రసరింపజేసితివనన్ శ్రీచక్రసంచారిణీ !

6. పరువంబా నశయించె, శక్తియుడిగెన్ ప్రారబ్ధమేపారెడిన్
సిరులాశల్‌గలిగించి మానసము విచ్ఛిన్నంబుగావించె, మో
హరుచుల్ నాహృదిబట్టి పీడనిడె, సాహాయ్యంబు లేరింక అ
స్థిరమౌ ఈవిధి రూపుమాపగదవే శ్రీచక్రసంచారిణీ !

7. ఆనందంబున తాండవింప హృదయంబావిష్కరింపంగ నే
దో నాదంబదె శ్రోత్ర పేయముగ నాందోళింపగాకన్నులన్
సూనాసార విశేష బాష్పములు రాసుల్‌గట్టి వర్షింప సు
శ్రీనించెన్ భవదీయ దర్శనమహో శ్రీచక్రసంచారిణీ !

8. అళులన్‌బోలి యరాళులై యలకలత్యంతంబు క్రమ్మంగ శ్రీ
కళలన్ చిందు భవన్ముఖంపు రుచి ధిక్కారించు పద్మంబునే
కులుకుల్ గూర్చెడి దంతకేసర రుచుల్ కూర్చున్ మనోజారికిన్
చెలువంబిచ్చెడి ఈక్షణాళుల తమిన్ శ్రీచక్రసంచారిణీ !

9. జలదంబై వికసించు నల్లకలువై శ్లక్ష్ణంబునై స్నిగ్ధమై
చెలువొప్పంగను నీదుక్రొమ్ముడియె మాచేతంపుధ్వాంతంబులన్
తొలగంజేయగ కల్పవృక్ష సుమసందోహంబు నీకొప్పులో
చెలువంబయ్యె సుగంధమాసగొనియో శ్రీచక్రసంచారిణీ !

10. నీహేమంపు కిరీటమందు వెలుగుల్ నింపంగ నాదిత్యులే
మోహావేశమునించు రత్నములనన్ మోదంబుజేకూర్పగా
ఆహా ! చంద్రకళే భ్రమింపజనె స్వర్గాధీశ చాపంబుగా
స్నేహార్ద్రంబగు దెంద మీయగదవే శ్రీచక్ర సంచారిణీ !

11. దినముల్ దొర్లుచునుండె నామది నెదో తీర్వంగరానట్టి వే
దన బాధింపగ జొచ్చె కారణమదేదైనన్ భయాందోళనా
జనకంబై దహియింపగా జనుచు నాశాపాశముల్ ద్రెంచె బ్రో
చి ననున్ నీయొడి జేర్చికొమ్ము జననీ ! శ్రీచక్ర సంచారిణీ !

12. శాపగ్రస్తుడనో తపః ఫలవిలాసామోద దూరుండనో
పాపంబో మరి పుణ్యమో యెఱుగ నా ప్రారబ్ధమెట్లున్నదో
నాపై కోపము జూపకమ్మ ! కృపతో నన్గాచి రక్షించి ని
క్షేపంబైచను జీవనంబొసగుమా శ్రీచక్రసంచారిణీ !

13. నీవే నాకిల రక్షణంబవని నేనిశ్చింతగానుంటి నా
భావాకాశమునిండ నీవె జగదంబా ! నిండి నాకెయ్యెడన్
నీవే సాయముజేయుచున్ పరమసాన్నిధ్యంబు కల్గించి నీ
సేవాభాగ్యము నాకొసంగ గదవే శ్రీచక్ర సంచారిణీ !

14. ఏమీ నీ కృపజూపవేమి జననీ ! ఏమింత తాత్సారమా ?
నా మానంబభిమానమున్ దొలగి నానాబాధలన్ పొంది నే
నో మోడై నిలువంగ జూడదలతే ? నోరారగా బిల్చితిన్
క్షేమం బీయగనెంచి వే గదలుమా శ్రీచక్ర సంచారిణీ ?

15. ఆర్తిన్ బాపగరావదేమి జననీ ! ఆశల్ పటాపంచలై
ధూర్తుల్ జూపిన రాగలంపటమునన్ తూలంగ నేజిక్కితిన్
కీర్తుల్ నాశనమై మనంబు పగిలెన్ గీపెట్టి, భావాక్షముల్
చేర్తున్ నీపదపీఠసన్నిధి కడన్ శ్రీచక్రసంచారిణీ !

16. సత్యంబై శివమయ్యు సుందరమునై సంజీవినీ విద్యయై
నిత్యంబై సరసార్ద్ర భావ సుమనః నీరాజనోత్సాహమై
స్తుత్యంబై భవనాశనా ప్రవిమల స్తోత్రార్థ సంభావనా
రీత్యానంద మొసంగు నీదు భజనల్ శ్రీచక్ర సంచారిణీ !

17. సాహిత్యంబను లోకయాత్రగమనా సక్తుండనై భావనా
సౌహిత్యంబును బంచ బూనితినిలన్ సత్కీర్తినాశించి చే
తో హృద్యంబగు భావజాలము మదిన్ తోపించి నాకండయై
స్నేహార్దంబున నిల్వబూనగదవే శ్రీచక్రసంచారిణీ !

18. నేరంబెంచకు తల్లి నీదుమదిలో, నిత్యంబు రక్షింపగా
భారంబంత వహించి బ్రోతువని యాప్యాయంబుగా జూచి నా
ప్రారంభించిన కార్యమెల్ల దయతో రాణింపగాజేసి నన్
జేరందీయుదువంచు నమ్మితి నెదన్ శ్రీచక్రసంచారిణీ !

19. నాకేదీ ఫలవంతమైన పరమామ్నాయాంతరంగంబు, నన్
సాకంగా, భవదీయ పాదరజమై సర్వస్వమర్పించి ఈ
లోకాతీత విశేషతన్మయసుధాలోలాత్మ భావుండనై
చేకొమ్మంచని ప్రార్థనల్ సలుపగా శ్రీచక్రసంచారిణీ !

20. నాజల్పంబు జపంబుగాగ, కరవిన్యాసాదులే ముద్రలై
నే జేయన్గతియే ప్రదక్షిణముగా, నేసల్పు చేష్టాదులే
పూజార్థంపు సపర్యలై అశనమే పొల్పారు హోమంబునై
శ్రీజీవాంగవిధుల్ ప్రణామములగున్ శ్రీచక్రసంచారిణీ !

21. శర్వాణీ ! నినువాణి సూక్తి సుధలన్ జాల్వార గీర్తింపగా
సర్వామోదముతోడ కర్ణపుటలన్ సంతృప్తిగా గ్రోలి హృ
త్పర్వంబై శిరమూగ కుండల ఝణత్కారంబు శోభిల్లె న
చ్చెర్వుంజెందగ మారుపల్కినటులన్ శ్రీచక్రసంచారిణీ !

22. నాకీవే భవతారకంబనగ నానారూపసంకోచముల్
చీకాకున్ గలిగించి మానసము నిశ్చేష్టంబు గావించినన్
శోకార్తిన్ భరియించి దేహమదె సంక్షోభంబులో క్రుంగినన్
చేకూర్పంగదె నీకృపారసఝరిన్ శ్రీచక్రసంచారిణీ !

23. నీవే బ్రహ్మకు దేవివంచు, హరికిన్ నీవే మహాదేవిగా
నీవే శంకరుపత్నివంచు హృదిలో నిన్నెంచ వేదజ్ఞులా
భావాతీత తురీయ రూపిణిగ విశ్వంబున్ భ్రమింపంగ నో
శ్రీవిద్యాపరదేవతా ! చెలగుదో శ్రీచక్రసంచారిణీ !

24. ఏదీ నీదు కృపారసంబు నిసుమంతేనిన్ ప్రసారింపనీ
మోదంబంది భవత్పదాంబుజములన్ పొల్పారసేవింపనీ
బోధాసారవివేక పూర్ణముఖసంఫుల్లాబ్జవై నిల్చి నా
సేదందీర్చెడి మార్గమేదొ గననీ శ్రీచక్రసంచారిణీ !

25. ఏదో కోపము బూని మదిలో నేమో విచారించి తీ
వేదో చేయదలంచినావు తరమౌనే నాకెఱుంగన్ భువిన్
మోదంబేర్పడురీతిగాగ కరుణన్ పూర్ణంబుగా జూపుచున్
శ్రీదంబైచనుదారి జూపగదవే శ్రీచక్రసంచారిణీ !

26. నీదాక్షిణ్యముచేత నీభువనముల్ నిశ్చింతగానిల్చు నీ
వేదో యెంచిన లోకముల్ చెడును వేరేశక్తి లేకుండ కా
దేదీ సృష్టి జగత్తునన్ మరల నీవిచ్ఛింపకుండంగ సు
శ్రీదంబైన కటాక్షమున్ బరపుమా ! శ్రీచక్రసంచారిణీ !

27. ఘోరంబైన విపత్తు వచ్చినను, నాకూర్మిల్ విదారించి చే
జారంబోయినగాని, మానసము దోషార్థంబుగా హేయమై
పారంబేదియు కానరాని అఘకూపంబందునన్ కూలినన్
చేరన్వచ్చితి నీవెదిక్కని సదా శ్రీచక్రసంచారిణీ !

28. భారంబంతయు నీవదాల్తువనుచున్ భావించి సంసారని
స్సారాబ్ధింబడి మున్గితేలుచు రసాస్వాదంబుగావింపగా
కోరంజూచితి, నా దొసంగు గనియున్ కోపింపకీవే దరిన్
జేరందీయుము తల్లి నన్నుగృపతో శ్రీచక్రసంచారిణీ !

29. ఏమీ నీకృపజూపవేమి, శరణంబీయంగ నీవేసుమా
నే ముక్తిన్గను మార్గమేదొ సరిగా నిర్దేశమున్ జేయుమా
ఏ మాలిన్యమునంటకుండ మది నీవే నిల్చి రక్షింపుమా
క్షేమంబీయగ వేరెలేరు భువిలో శ్రీచక్రసంచారిణీ !

30. పంతంబూనకు నా పయిన్ తలప నా ప్రావీణ్యమేనెంత నీ
చెంతన్ జేరగజూచు భక్తుడను నా చీకాకు పోకార్చి కా
సంతైనన్ భవదీయ పాదజలజధ్యానైకచిత్తంబిడన్
చింతల్ దీర్పగ వేగబూనగదవే శ్రీచక్రసంచారిణీ !

31. ఈలోకంబు త్రిమూర్తులే పరగ సృష్టింపంగ రక్షింపగా
నోలిన్ బూని లయింపజేతురనుచున్ ఊహింత్రు సర్వాత్ములున్
ఆలోచింపగ నీవ ఈ క్రియలకున్ ఆధార భూతంబవై
శ్రీలీలల్ ప్రకటింపజేయుదు వహో శ్రీచక్రసంచారిణీ !

32. ఈ నీలీల వచింపశక్యమె । ప్రమోదింపంగ నా జిహ్వపై
వాణీరూపమునంది నిల్చితివి సంభావింపగా నెల్లరున్
సూనాసార వివేక భాసురముగా సుజ్ఞాన దీపాంకుర
శ్రేణీమార్గవిశేష బోధకముగా శ్రీచక్రసంచారిణీ !

33. తల్లీ ! నీపదరేణువున్ వరముగాదాల్పంగ లోకంబులన్
సల్లాపంబుగ సృష్టిజేయు నజుడున్ సమ్మానమౌనంచు దా
నుల్లంబందున నెంచివేయితలలందుంచంగ విష్ణుండు వా
సిల్లన్ బూను విభూతిగా శివుడదే శ్రీచక్రసంచారిణీ !

34. కరముల్మోడ్చితి నీదయారసము చిల్కంగా ప్రమోదింపగన్
వరముల్ వేడితి నన్ నిరంతరము కాపాడంగ నీభూమిపై
పరమున్ గోరితి సన్నిధానమున నిల్వంగా నహోరాత్రముల్
శిరమున్ మోపితి నీపదంబులకడన్ శ్రీచక్రసంచారిణీ !

35. శరణంటిన్ చరణంబులన్ విడక నీ సాన్నిధ్యమున్ గోరుచున్
వరమిమ్మంటిని భక్తిభావమున సంభావించి, నేమ్రొక్కగన్
వెరవేదైనను జూపుమంటిని రసావేశంబులో మున్గగన్
స్థిరచిత్తంబున బ్రోవుమంటి జననీ శ్రీచక్రసంచారిణీ !

36. ప్రీతిన్ జెందకయుంటివో సరగునన్ పిల్వంగ రావెంతకున్
ఏతెంచన్ హృదయంబులో తలపవో ఏమందు నాభాగ్యమున్
చేతున్ నీపదపూజలెప్డు మదిలో చీకాకుబోకార్చి వే
చేతోమోదముగల్గజేయగనుమా శ్రీచక్రసంచారిణీ !

37. పరమాశ్చర్యము గల్గుచున్నది భవత్పాదాంబుజంబుల్ మదిన్
నిరతోత్సాహముతోడ గొల్చి జననీ ! నీవింక రక్షింపగా
కరుణన్ జూపుమటంచు వేడగ పరాకా ! నీకు కాఠిన్యమా
శిరమున్ వంచిన లెంక నేను గనుమా శ్రీచక్రసంచారిణీ !

38. కర్ణాభ్యర్ణములై కనుల్ గరుతలై కన్పట్టు పక్ష్మంబులా
కర్ణాకృష్టములైన మన్మథ శరాకారంపు శృంగార సం
కీర్ణంబై త్రిపురారి చిత్తమున సంక్రీడించు శాంతంబు నా
శీర్ణంబౌగతిజేయునో గిరిసుతా ! శ్రీచక్రసంచారిణీ !

39. వీణన్దాల్చిన వాణి దా పశుపతిన్ వీరోచితాకారుగా
గానంబేర్పడ జేయనయ్యది శిరఃకంపంబుగల్పింప, నీ
యానందాద్భుతసాధుమాధురులు ధిక్కారింప తంత్రీస్వన
శ్రీనిన్, చోళినిగప్పె వీణియపయిన్ శ్రీచక్రసంచారిణీ !

40. త్వన్నేత్ర త్రయమున్ విభక్తములగున్ త్రైవర్ణ్యసంశోభితా
భిన్నంబై విలసత్కళాంజనమునన్ ప్రేమాస్పద స్ఫూర్తి నా
పన్నార్త్యాది త్రిమూర్తులన్ యుపరత ప్రాప్తాశ్రిత శ్రేష్ఠులన్
చెన్నారంగ పునః సృజించుట కనన్ శ్రీచక్రసంచారిణీ !

41. ధన్యంబాయెను నాదుజన్మ వరమంత్రాధిరాజంబు నా
పుణ్యం బొప్పగ లభ్యమైనదిల సంపూర్ణాను రాగంబుతో
గణ్యంబైన కృపాకటాక్షమున ప్రజ్ఞానాశ్రితామోద దా
క్షిణ్యాకార గురూపదేశముననో శ్రీచక్రసంచారిణీ !

42. భావాతీతము సాధుపూజితము సద్భావాంతరాలోల సం
సేవాసక్తవిశేష భాసురము రాశీభూత పాపార్థ పా
రావారాంతరమగ్న తారకము ధారాపాత కారుణ్య సు
శ్రీవాత్సల్యము నీపదాంబుజ మహో శ్రీచక్రసంచారిణీ !

43. వాణీ రూపముగొన్న బ్రహ్మసతిగా, పద్మాక్షు హృద్రాజ్ఞిగా
సూనాస్త్రారికి ధర్మపత్నిగ విదుల్ స్తోత్రంబుగావింత్రు గా
నీ, నీనాల్గవ రూపచిద్విలసనంబీ విశ్వమాయార్థ ని
శ్రేణిన్ గూర్చి భ్రమింపజేయును గదా శ్రీచక్రసంచారిణీ !

44. భద్రంబీయగ వేడుచుంటి నను కాపాడంగ వే రమ్మికన్
నిద్రాణంబగు నా హృదబ్జకలికన్ నిస్తేజదేహంబు భా
వోద్రేకాంకిత మానసాంతర తరంగోత్సేకమున్ జూడుమా
చిద్రూపంబున బ్రోవగా దలచుమా శ్రీచక్రసంచారిణీ !

45. నీవే నాకిలదిక్కు నీవ నడుపన్నిశ్చింతగా నుందు నా
కీవే సర్వశుభంబులిచ్చు వరలోకేశాని వీవిశ్వమం
దీవే జీవము జీవనాత్మక విలాసేచ్ఛాస్వరూపంబు ని
ర్జీవంబైచను నాదురీతిగనుమా శ్రీచక్రసంచారిణీ !

46. దీనాధారవు నీవు సర్వగతులన్ దేదీప్యమానంబుగా
సూనాసారవిపాక వాగ్ఝరులతో శోభిల్లగాజేసి వి
న్నాణంబైన ప్రశస్తి నిచ్చెదవు మౌనశ్రేష్ఠనిద్రాణునిన్
క్షీణంబై నశియించు జీవునిలలో శ్రీచక్రసంచారిణీ !

47. నీవే నేనని నేనె నీవనుచు లోనిత్యంబు నేనమ్మి నా
భావాకాశము నిండు చిద్విమలరూపంబున్ విలోకించుచున్
సేవాభాగ్యము నాకొసంగుదని నిశ్చింతన్ ప్రశంసించెదన్
శ్రీవిద్యా పరదేవతా భగవతీ శ్రీచక్రసంచారిణీ !

48. నీరూపంబదె నాదుకన్గవకెదో నిర్వ్యాజతేజోవిశే
షారూఢిన్ గలిగించినట్లు, చిరసౌఖ్యాలోక సందర్శనా
ప్రారంభం బొనరించినట్లు మదిలో రాగోన్ముఖాంభోజ సు
శ్రీరోచుల్ ప్రసరించినట్లు చెలగెన్ శ్రీచక్రసంచారిణీ !

49. నీమహాత్మ్యము నెన్నగా దరమె ధ్యానింపగ పూజింపగా
నీమంత్రంబు జపింప బూనుకొనగా నేనెంతవాడన్ భువిన్
ఏమాత్రంబును శక్తిలేని జడుడన్ ఈవే ప్రశాంతంబుగా
క్షేమంబిచ్చి సతంబు బ్రోవుమిలలో శ్రీచక్రసంచారిణీ !

50. నీ దివ్యామృత పాదతీర్థమిలతో నిశ్శేషజాడ్యాప హా
రోదారౌషధరాజమై, విమల సారోత్సాహ సందీపిత
శ్రీదంబై, పరమాద్భుతాంచిత విలాసీభూత సుజ్ఞాన ని
ర్వేదంబై, మహిమాన్వితంబగునహో శ్రీచక్రసంచారిణీ !

51. ప్రణుతిన్ జేయగలేను నీపరమభద్రాకార చిద్రూపమున్
ప్రణతిన్ గూర్పగలేను నీపదపవిత్రాంభోజయుగ్మంబు నే
మనసున్ నిల్పగలేను నీవిమల సన్మంత్రాక్షరా యోగమున్
చినుకన్ జేయుము నీకృపారసమదే శ్రీచక్రసంచారిణీ

52. నన్నీరీతిగ బాధపెట్టతగునా ? నాతప్పులన్నింటినిన్
మన్నింపంగ దయాంతరంగవయి క్షేమంబొప్పగా జూడుమా
నిన్నే నమ్మిన దీనుడన్ తిరముగా నేనెంచు ప్రత్యాశలన్
ఛిన్నాభిన్నముసేయబోకు జననీ శ్రీచక్రసంచారిణీ !

53. నాభావాంబర వీధియందు తిరమై నవ్యాతినవ్యంబుగా
శోభల్గూర్చుచునిల్చి జగమే శూన్యంబుగా జేయు నా
లోభాయత్త విదగ్ధచిత్తమెద నాలోకించి మేలెంచి సు
శ్రీభవ్యంబగు దారిజూపగదవే శ్రీచక్రసంచారిణీ !

54. తరమా ! నీమహనీయగాథలను గ్రంథస్థంబుగావింపగా
పరమామ్నాయ విశేష పూజలను సంప్రార్థించి సేవింపగా
నిరతానందపు భక్తికీర్తనల ధ్యానింపంగ లోనెంచగా
చిరసౌఖ్యావహ మార్గమీవె యిడుమా శ్రీచక్రసంచారిణీ !

55. నీవే మానసతత్త్వమాకసమనన్ నీవే మహామారుతం
బీవే, ఘోరహుతాశనంబును జలంబీవౌదు, భూతత్త్వమున్
నీవే, నీకు పరంబనంగనది లేనేలేదు, చిద్రూప ము
జ్జీవింపంగ భవానిగా చెలగుదో శ్రీచక్రసంచారిణీ !

56. ధనువా పౌష్పము, మౌర్వియున్ మధుకరాధారంబు బాణంబులున్
గనగానైదు, వసంతుడా సఖుదు, తాకన్ మారుతంబే రథం
బనగా, దానొకడే యనంగుడు, త్వదీయాపాంగ దాక్షిణ్య మూ
రిన నీలోకములన్ జయించునుగదా శ్రీచక్రసంచారిణీ !

57. చరితార్థంబుగ నాదుజన్మ వరదీక్షాయుక్త మంత్రోపదే
శ రహస్యార్థము లందుకొంటి నల శ్రీశైలాగ్రపుణ్యస్థలిన్
నిరతానందముగల్గజేయగదె నానిస్తేజజీవంబునన్
స్థిరచిత్తంబును నీదు భక్తినిదుమా శ్రీచక్రసంచారిణీ !

58. తెలియాధారమునందు భూమి, నల స్వాధిష్ఠానమందగ్నినిన్
జలముం దన్మణిపూరమందు, హృదయాబ్జంబందు గాలిన్ పయిం
గళచక్రంబున నాకసంబు మనమాజ్ఞా చక్రమందోలి చే
రి లయంబెంతు సహస్రమందు పతితో శ్రీచక్రసంచారిణీ !

59. ఊహాతీతము వర్ణనాధికము భావోద్రేకసంభావనా
శీహర్షాశ్రు విశేషసేవితము, నీ లీలా వినోదం బహో
ఏహోయిన్ జనియింపజేయుదువా ! నేయేవేళ నెవ్వారి కే
స్నేహంబేర్పడ గూర్తువో తెలియునా ! శ్రీచక్రసంచారిణీ !

60. అమ్మా ! నీకృపజూపవేమి ? నను నీహర్షంబునన్ ముంచవే
మమ్మా ? ఇంతపరాకదేల ? తగునమ్మా నీకు బ్రోవంగ రా
వమ్మా ! దోషమదేదియైన కనుమమ్మా నాహృదబ్జంబుపై
చిమ్మంజేయుము నీ దయారసమదే శ్రీచక్రసంచారిణీ !

61. శ్రీకంఠుల్ పచరింప నల్వురు శివస్త్రీ పంచసంఖ్యంబు ప్ర
త్యేకంబై నవమూలమౌ ప్రకృతులందింపొందు నంభోజముల్
సాకారాష్టమ షోడశాభదళమై చక్రానరేఖాళి సు
శ్రీకోణాంచిత మేఖలా త్రితయమౌ శ్రీచక్రసంచారిణీ !

62. నీపాదద్వయినిన్ స్రవించెడి సుధానీకంబుచే నాడుల
న్నేపారన్ తడిపీవు చంద్రుని విడన్నైతెంచి భూతత్వమున్
ప్రాపింపన్ భుజగాకృతిన్ వలయమై స్వాత్మస్వరూపంబు ని
క్షేపింతా కులకుండమందు నిదురన్ శ్రీచక్రసంచారిణీ !

63. ఏమో ఎందుకు నన్నిటుల్ నడువగా నేర్పాటుగావించితో
నామానంబును ప్రాణముల్ నిలుపగా నాకీవెదిక్కంచు నే
మోమోటంబునులేక పల్కితిగదా మోదంబుగల్గించి నా
క్షేమంబెప్పుడు జూచి బ్రోవగదవే శ్రీచక్రసంచారిణీ !

64. ఏమీ నాదెసజాడవేమి ? నను నీవే రక్షసేయంగ రా
వేమీ ! నీవిలబ్రోవకున్న పరులేరీ నన్ను కాపాడగా
ఈ మాయావిలలోకమందు కనలే నేకార్యసామర్థ్యమున్
సేమంబిచ్చి సతంబు బ్రోవగదవే శ్రీచక్రసంచారిణీ !

65. నిత్యంబేర్పడ నీపదాంబుజములన్ నిర్మోహభావాన నీ
ప్రత్యంగంబును గాంచువేళ మదిలో భావార్థసంకేతమై
ప్రత్యేషోదయ కాంతిరేఖలెవియో పారంగ నాదేహమే
ప్రీత్యాఖ్యాన విశేషభాసురమగున్ శ్రీచక్రసంచారిణీ !

66. అహో ! ఈ పులకాంకురంబులవి యూహాతీతవైభోగమై
దేహంబందున క్రొత్తశక్తియెదియో దివ్యంబుగా నిల్చి సం
దేహంబంతయు దుళ్లగొట్టి వరసందీప్తార్థ బోధాంగ సు
స్నేహోదంచితభక్తి తత్త్వమొసగున్ శ్రీచక్రసంచారిణీ !

67. ఏవో కోరికలేను కోరను సతంబీలోకమందేర్పడన్
నీ వీణావరతంత్రినై పరమసాన్నిధ్యంబుగల్పించు నీ
సేవాభాగ్యవిశేష భావపదరాజీవాళి రూపాత్మనై
శ్రీవిద్యాసుధలెల్ల గ్రోలదలతున్ శ్రీచక్రసంచారిణీ !

68. ఏదోశక్తి త్వదీయ పాదజలజాళీరూప సంభావ్య స
మ్మోదాపూరవిలాసలాస్యవర సమ్మోహార్భటీ చేతమై
వేదాంతాంచిత భావగంధమయమై ప్రేయంపుశ్రేయంబునై
శ్రీదంబై ననుపట్టిలాగు జననీ శ్రీచక్రసంచారిణీ !

69. ఆరాధించిన నిన్ను జేయవలె దా నాత్మర్పణోత్సాహియై
చేరంజూచిన నిన్నుజేరవలె నాశీర్వాద సంభావియై
కోరంబోయిన నిన్ను కోరవలె సాంగోపాంగ సంప్రార్థియై
చీరంబూనిన నిన్ను జీరవలెనో శ్రీచక్రసంచారిణీ !

70. ఆశాభంగముజేతువేల పరమాత్మానంద సంధాన సం
కాశాపూర విమోహనోత్సవ సుధాగంభీర మగ్నుండనై
ఆశారూపవిలాసదూర మదనాయత్తంపు చిత్తుండనై
శ్రీశర్వాణి ! నినుం దలంపగనినన్ శ్రీచక్రసంచారిణీ !

71. నాప్రారబ్ధవిమోచనోద్ధరణ సన్మార్గోపదేశార్థమౌ
నా ప్రాణోత్సవహేతుభూత పరమామ్నాయాశ్రయోపేతమౌ
నీప్రేమాస్పదభావరూప రచనానేతృత్వ సంవేద్యమౌ
శ్రీప్రీత్యాదరవిద్యనంద గనుమా శ్రీచక్రసంచారిణీ !

72. ఏదోభావన మిన్నుముట్టె మదిలో నేదోవిలాసంబు చి
న్మోదంబందగ తాండవించె భవనిర్మోహంపు మార్గంబెదో
వేదోక్తంబగు రీతిదోచె వరనిర్వేదార్థ సుజ్ఞాన సు
శ్రీదంబౌ భవదీయ రూపముగనన్ శ్రీచక్రసంచారిణీ !

73. కార్యారంభము సేయువేళ నరసంఘంబందు లోపించు నౌ
దార్యంబెన్న దలంచువేళ వరనాదబ్రహ్మరూపాత్మ సౌం
దర్యోపాసన సల్పువేళ నినుసందర్శించి పూజించి నా
శీర్యోగంబు నొసంగ వేడుదునహో శ్రీచక్రసంచారిణీ !

74. జననీ ! చంద్రునిబింబమౌ జలము, ప్రాశస్త్యంపు కస్తూరి క
న్గొనగా చంద్రకళంకమే, కళలవే క్రొంగొత్తకర్పూరమౌ
దిన భోగంబున రిక్తమౌ మరకతాత్తేజంపు పేటిన్ విరిం
చి నితాంతంబుగ నింపు నిత్యవిధిగన్ శ్రీచక్రసంచారిణీ !

75. ముఖచంద్రస్మితకౌముదీ మధురిమన్ మోదంబుతో గ్రోలి ఆ
సుఖమే చంచువులందు మాంద్యమొసగన్ సొంపార శీతాంశు శ్రీ
ముఖ బింబామృతమెంచి కాంజికముగా పొందున్ చకోరంబులా
శిఖరోచ్ఛ్రాయపు నామ్లపుం రుచికిలన్ శ్రీచక్రసంచారిణీ !

76. కాలంబా శరవేగవాహినిగ సంఘర్షించుచున్‌బోవు నా
మూలంబేదొ కనంగజాలనిగతిన్ మోహోర్భటిన్ గూర్చుచున్
కాలాతీతము పాపనాశకర దుఃఖాతీత సంభావనా
శీలంబౌ సుఖజీవనంబునిడుమా శ్రీచక్రసంచారిణీ !

77. ఐంకారంబగు వాణి రూపమున విద్యాదాయివై యొప్పి ఆ
హ్రీంకారోజ్జ్వల దివ్య రూపిణిగ నిర్వేదంబులన్ దీర్తు వా
క్లీంకారాశ్రిత కామబీజమున గల్పింపంగ సర్వార్థముల్
శ్రీంకారాత్మక సర్వలోకజననీ శ్రీచక్రసంచారిణీ !

78. ఏదోకోరిక తీరకుండి మనమందీచింత పల్లార్చి నీ
పాదాబ్జంబుల గొల్చువేళ స్థిరసంభావ్యంపు నిష్కామసం
వేదంబై పరలోకపూర్ణఫల సంవేద్యంబునై సర్వసు
శ్రీదంబౌగతి కానరాదు జననీ ! శ్రీచక్రసంచారిణీ !

79. ఆశాదీపము నీవయంట । ఇహలోకాతీత సౌఖ్యార్థికిన్
కోశాగారము నీవయంట । పరలోకోద్ధారణాశీలికిన్
రాశీభూతవిలాసమీవెయట దౌర్భాగ్యార్థదోషాత్మకున్
శ్రీశర్వాణి । విచారదూరజననీ । శ్రీచక్రసంచారిణీ !

80. ఏదో పూర్వకృతంపు పుణ్యమున నాకీసాహిత్యగంధ మా
మోదార్హంబుగ నబ్బె జన్మసఫలంబొందంగ నీకింక నా
హ్లాదంబున్ గలిగింతునమ్మ కవితాహ్వానంబునందించి నీ
శ్రీదంబౌ దరహాసరోచి గనవే శ్రీచక్రసంచారిణీ !

81. కోపంబా జననీ ! భవాబ్ధిబడి నే కూలంగ ప్రాల్మాలుదే
శాపంబా పొడ జూపకుంటివిల నాశార్థప్రదీపంబుగా
పాపంబా నను నీపదాబ్జముల గొల్వంజేరనీవేల ని
క్షేపంబై చనుదారి జూపదగవే శ్రీచక్రసంచారిణీ !

82. ఆధారంబును నీవె కార్యముల కాయాకారణంబీవె ఈ
బాధాతప్త హృదంతరాళ భవనిర్బంధార్తి లోకంబులన్
శోధింపంగ ననేక చిత్రగతులన్ జూపించి తత్త్వాంకిత
శ్రీధీశక్తి విలాసమిత్తువుగదే శ్రీచక్రసంచారిణీ !

83. ఏమో నాస్థితియెట్టులుండునొ తుదిన్ ప్రేత్యుండనౌవేళ
కామక్రోధములావహించెడినొ చీకాకుల్ హృదిన్ గ్రమ్మునో
నామంబేనిదలంచు శక్తిగనునో నాదేహమందంగముల్
క్షేమంబబ్బెడి దారి జూపుమిపుడే శ్రీచక్రసంచారిణీ !

84. స్పష్టంబయ్యెను నీదు శక్తి జగతిన్ పాలింపలేరింక ఈ
సృష్టిన్ జేసియు పెంచి నాశమొనరన్ జేయంగ నీకేతగున్
దుష్టుల్ గూలగజేసి శిష్టులలరన్ దోషంబు మన్నించి ఆ
శిష్టంబైన ఫలంబు జూపెదవహో శ్రీచక్రసంచారిణీ !

85. అమ్మా నిన్నుదలంచి ముందడుగు వేయంగా నిదానింపదా
సమ్మోహాంబుధి మున్గి భావరుచులన్ సాధించు యత్నంబు నీ
నెమ్మోమున్గను నాక్షణంబె చని వర్ణింపంగ నీరూపమే
చిమ్మున్ డెందమునన్ కృపారసమహో శ్రీచక్రసంచారిణీ !

86. నీవేరీతి దయాంతరంగమున క్షోణిన్ మానవాళిన్ కృపన్
బ్రోవంబూనుదువో యెఱుంగదరమే పుణ్యంబుపండంగ నీ
సేవంజేయగ నేవిధంబున పరీక్షింపంగ లోనెంచెదో
జీవాధారమొసంగి కావగనెదో శ్రీచక్రసంచారిణీ !

87. ఏదో చింత హృదిన్ చరించి సతతంబేదో విమోహంబు నీ
పాదాబ్జంబుల జేరనీక మది రాపాడంగ ధ్యానంబుపై
పోదేమాత్రము నామనంబు జననీ ! పూజింప వీలెట్లగున్
శ్రీదంబైన విధంబు జూపగదవే శ్రీచక్రసంచారిణీ !

88. నిను నాదెందమునందు నిల్పితి భవానీ యంచువేడంగ నా
క్షణమందే వరమిచ్చి బ్రోతువిల నాశాదీపమై వెల్గుచున్
ప్రణవాధారవిశేష చిద్గగనసంభావ్యార్థబోధల్ సృజిం
చిన నాదాభ్యసనంబు సార్థకమనన్ శ్రీచక్రసంచారిణీ !

89. అన్యంబైకను దేవతాగణము భక్తాళీ కృపాప్లావితో
దన్యంబైన వరాభయాంక వర హస్తంబుల్ ప్రదర్శింప నీ
పుణ్యాంఘ్రి ద్వయమే భయంబునణచున్ పూరించు వాంఛార్థ దా
క్షిణ్యాకారవరేణ్యమై శరణమై శ్రీచక్రసంచారిణీ !

90. శృంగారార్ద్రగ జూతు వీశ్వరుని నీ ఛీత్కారమౌ కుత్సనన్
గంగాదేవిని రోషమూర, గిరిశాగాథాళినిన్ విస్మయా
సంగంబై, అహులందు భీతి, కమలాసౌభాగ్యమున్, స్మేరవా
రింగూలన్ చెలులన్, ననున్ కరుణతో శ్రీచక్రసంచారిణీ !

91. శివుడా శక్తినియుక్తుడైన తఁటినే సృష్టింపగా శక్తుడౌ
భవుడట్లుండనిచో నశక్తుడుగనౌ స్పందింప, బ్రహ్మాది దే
వవతంసంబగు నిన్ స్తుతించి నతిసల్పంగా సమర్థుండగున్
శివరాణీ। కృతపుణ్యుడీ జగతిలో శ్రీచక్రసంచారిణీ !

92. అజ్ఞానాంధుల సూర్యలోకముగ, మందాత్మాప్త చైతన్య సం
విజ్ఞానార్ణవ మాధురీ ఝరిగ, సంపీడార్తలోకంబునన్
సుజ్ఞేయంబగు మానికంపుసిరిగా, శోషిల్లు సంసారికిన్
శ్రీజ్ఞానాది వరాహదంష్ట్రవుగదే శ్రీచక్రసంచారిణీ !

93. సారంబేదియొ గాంచగా నరుదు సంసారాబ్ధిలో మగ్నుడై
దారాపుత్ర విమోహబంధనమునన్ దా కొట్టు మిట్టాడుచున్
పారంచేదియు గానరాక తన దౌర్భాగ్యంబనున్ గాని నీ
శ్రీరమ్యంబగు నామమెంచడుగదా శ్రీచక్రసంచారిణీ !

94. నాకేకోరిక లేదు నిన్నెదను ధ్యానంబొప్ప సేవింప, నా
శోకార్తంబగు జీవితంబునిల సంక్షోభంబుగాకుండ నీ
రాకాపూర్ణ శశాంక రోచిబరగన్ రంజిల్లి సర్వస్వమై
చీకాకున్ దొలగింప వేడుకొనెదన్ శ్రీచక్రసంచారిణీ !

95. ఆరంభించిన నాదుకార్యములకే యాటంకముల్లేక నీ
సారథ్యంబున నిత్యశక్తియుతమై సాఫల్యమున్ జెందగా
ప్రారబ్ధావిల దోషనాశకరమై రంజిల్లగా జేసి నన్
జేరందీయుము తల్లి నీదు నొడికిన్ శ్రీచక్రసంచారిణీ !

96. నీవే నాకిల దిక్కటంచు మదిలో నిత్యంబు నేనెంతు, నీ
సేవాతత్పర భక్తలోక వర రాశీభూత సౌభాగ్యముల్
భావాతీతపు లోకరక్షణ కళావైదగ్ధ్య సుజ్ఞానమున్
శ్రీవాత్సల్య కృపాకటాక్షమనగన్ శ్రీచక్రసంచారిణీ !

97. సంసారాంబుధి మున్గితేలుచును, నిస్సారంపు జీవేచ్ఛలో
హంసీరూపమునంది ఈదుచును హాహాకారముల్ సేయు వి
ధ్వంసంబైన విచారమగ్నుదను బాధాతప్తుదన్ నీదు ని
ర్హింసంబౌ కనుచూపు నిల్పగదవే శ్రీచక్రసంచారిణీ !

98. ఆయాసంబును వీడి దివ్యమగు నీ యాకారము న్నెంచుచున్
నీయాజ్ఞన్ శిరసావహించి సతమున్ నే కాలమున్ బుచ్చుచున్
సాయంబై శరణంబ వీవయయి ప్రజ్ఞానంపు బ్రహ్మాత్మవై
శ్రేయంబిత్తువటంచు నమ్మితినెదన్ శ్రీచక్రసంచారిణీ !

99. సరసాపాంగము నాపయిన్ సతతమున్ సారింపుమో యమ్మ నీ
కరుణాప్లావిత పాదపీఠమున మ్రొక్కన్‌జేసి సమ్మానితా
దరహాసాంకురరోచితో నభయహస్తంబున్ ప్రసాదించు సు
స్థిరమౌ భక్తివిశేష చిత్తమిదుమా శ్రీచక్రసంచారిణీ !

100. అమృతాబ్ధిన్ సురవృక్షవాటిపరివృత్తంబౌ మణిద్వీప మం
దమరన్ నీపవనంబు సారహిత భాగ్యం బొప్ప చింతామణి
క్రమవాసాన త్రికోణ భావశివపర్యంకంబునన్ జ్ఞాన దా
త్రి మహాకాశమునన్ జెలంగుదువహో శ్రీచక్రసంచారిణీ !

101. ఏమినాగతి జూడవేమి ? నినుసేవింపంగ నీరూపమున్
క్షేమంబీయగ జూపవేమి ? కలిలో శ్రేయంబు జేకూర్పగా
నీమోక్షార్థపదాంబుజంబులెసుమా నిత్యంబు పూజార్హముల్
శ్రీమంతంబగు మార్గమేదొ కనగా శ్రీచక్రసంచారిణీ !

102. సర్వంబీవయి నిర్వహింతు వనుచున్ సాహాయ్యమందించి న
న్నుర్విన్ రక్షణ సేతువంచు ఫలమేదో అందజేయంగ నా
గర్వంబంతయు పారదోలిఎదుటన్ గన్పించి నన్ బ్రోచి ఆ
శీర్వాదంబు నొసంగుదంచు దలతున్ శ్రీచక్రసంచారిణీ !

103. ఆలాపంబది నిన్ను గూర్చి సలుపంగా బూనితిన్ తల్లి నీ
లీలామానుషరూపముల్ దెలియగా లేరన్న నేనెంత నా
కేలా చింత ! మదీయ మానసమునందీవుండి కాపాడి సు
శ్రీలందింప నిరంతరంబు మహిలో శ్రీచక్రసంచారిణీ !

104. రవియే దక్షిణ నేత్రమై పగటినిన్ రంజింపగా చంద్రుడే
భవదీయంబగు వామనేత్రమయి శోభాపూర్ణుడై యొప్పగా
నవరాగోభయ సంధ్యలై నొసటిపైనన్ కన్ను స్వర్ణాబ్జరో
చి విరాజిల్ల జగంబులేలెదవహో శ్రీచక్రసంచారిణీ !

105. చెలువారంగను పద్యవిద్యయొసగన్ చింతింపుమా నెమ్మదిన్
పలుకన్ జేయుము నాదు వాక్కునను సొంపారన్ సుశబ్దంబులన్
కలుగన్ శాశ్వత కీర్తికాయమిలలో కామ్యార్థసంధాయినీ
చిలుకన్ జేయుము నీ కృపారసమునో శ్రీచక్రసంచారిణీ !

106. ఘనకార్యంబుల నేమి జేసితినిలన్ కాలప్రవాహంబు చూ
పిన మార్గంబున పర్వులెత్తుచు మనః ప్రీతిన్ విలోకించితిన్
మనసాసించినదేది చేయనయితిన్ మ్రాన్పాటుతో తల్లి బ్రో
చి ననున్ సార్థక జీవనం బొసగుమా శ్రీచక్రసంచారిణీ !

107. అపరాధంబులు సైచుమమ్మ నిరతాహంకార దోషాత్ముడన్
చపలాపాంగ విలాస లసదాశాపాశబద్ధుండ శ్రీ
తపనాయత్తవిలోల చిత్తుడను చింతాక్రాంత భావాత్తష
డ్రిపుదుర్వర్గ పరాభవుండ జననీ ! శ్రీచక్రసంచారిణీ !

108. కవనంబబ్బిన పుణ్య భాగ్యమున నిష్కామంపుభావార్థ సం
భవసందీప్తి లొసంగి లోకమును సౌభాగ్యోన్నతిన్ దేల్పగా
నవరాగాన రచించితిన్ శతకమున్ నానాప్రబోధంబుగా
శివలెంకాన్వయుడం ప్రకాశబుధుడన్ శ్రీచక్రసంచారిణీ !

నీవాడంచు దలంచుమమ్మ మదిలో
నిత్యోత్సవం బొప్పగా
సేవాదృక్పథమంద నీవిషయ
సంక్షేపాత్మకంబీకృతిన్
బ్రోవంబూనగ నీకెయంకితముగా
పూజార్థమై యిచ్చెదన్
శ్రీవిద్యా పరదేవతా భగవతీ !
శ్రీచక్రసంచారిణీ !



# దండకం

శ్రీచక్రసంచారిణీ లోకరక్షాకరీ శాకినీఢాకినీభూత సంహారిణీ సజ్జనాళీ నిరాశావిదారీ ప్రశాంత ప్రసాదీ చిదానందరూపే సురానీక సంస్తుత్య పాదారవిందే ప్రమోదామృతాపూర విభ్రాజితాలోకినీ మౌనిహృద్వీధి సంభావినీ భద్రరూపే విశాలాక్షి మాహేశ్వరీ ఈశ్వరీ, తత్త్వ సంగీత సాహిత్య విద్యా సుధామోదినీ భావనారూప సద్భావినీ త్రిమూర్త్యాత్మకాధార సత్త్వాది తత్త్వాంకితే సర్వమంత్రాత్మికే సర్వయంత్రాత్మికే శ్రీపరాంబా మదంబా కృపాసాగరీ నిశాచార విధ్వంసినీ నాట్యసమ్మోదినీ సర్వలోకాశ్రయా శక్తిరూపే త్రికాలస్వరూపే విరూపే నిరాధార భక్తాశ్రితాపాదపద్మా ! విలాసాదివైభోగభద్మా! విముక్తిప్రదాత్రీ శుభాకారగాత్రీ దయారూపనేత్రీ ప్రసాదామృతా పూర్ణదృష్టీ వినోదాత్మకాసార సృష్టీ సురానేక సంభావనాస్తోత్ర తుష్టీ ప్రశాంతస్వభావాశీల వాగ్భూషిణీ వేదసంకాశినీ !

నిన్ను వర్ణింప నీక్షేత్ర మహాత్మ్యమెన్నంగ నేనెంతవాడన్ భువిన్ నీవె రక్షింతువంచున్ సదా బ్రోతువంచున్ విరాగంబు కల్పించి ఈలోకమందే ప్రశాంతిన్ ప్రసాదించు సంజీవనంబిచ్చి నన్ గాతువంచున్ దలంతున్ నీపదాంభోజముల్ నాకు దిక్కంచు విశ్వాసమున్ గల్గి నేనుంటి నాశక్తి నాయుక్తి నారక్తి నాభక్తి సర్వంబు నీవే యటంచున్ మదిన్ నమ్మితిన్ తల్లి ఓంకార ఐంకార హ్రీంకార శ్రీంకార బీజాక్షరీ శ్రీకరీ భ్రామరాంబా ! పాహిమాం పాహిమాం పాహిమాం పాహి నమస్తే నమస్తే నమః.

